# బ్రహ్మశ్రీ విద్వాన్

# శ్రీ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి



## సాహిత్య, సామాజిక సేవ వార్తాపత్రికల

## సంకలనం

## 132 వ జయంతి కానుక

## Table of Contents

# బ్రహ్మశ్రీ విద్వాన్ శ్రీ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి

ఇది అయన 132 వ జయంతి సంవత్సరం, ఈ సందర్భం గా అయనకు నివాళి గా అయన రాసిన విషయాలు వివిధ సందర్భాలలో ప్రచురితమైన పుస్తకాల, వార్తా పత్రికలలో వచ్చిన అంశాల సమాహారం.

<u>అయన గురించి</u>

ఇంటిపేరు గబ్బిట. ఆంగీరస, అయాస్య, గౌతమ త్రయార్షి ప్రవరాన్విత గౌతమస గోత్రం .కృష్ణ యజుర్వేద శాఖ. తెలగాణ్య శాఖ బ్రాహ్మణు తాత గారు శ్రీ దక్షిణామూర్తి శాస్త్రి గారు వారి భార్య కనకమ్మ వారికీ శ్రీ దుర్గాపతి శాస్త్రి గారు జన్మిచారు.




శ్రీ గబ్బిట దుర్గాపతి శాస్త్రిగారు, ఏలూరు ప్రక్కన దెందులూరు మండలం లో రామారావు గూడెం అగ్రహారీకులు. అక్కడ ఒక చిన్న శ్రీ ఆంజనెయ స్వామి దేవాలయం ఉండేది. పొలం వ్యవసాయగొడ్లు గోదా పాడి పంటా పాలేర్లు నిఘామాన్లు ఉండేవారు. నాగమ్మ గారు ఉయ్యూరుకు చెందిన గుండు లక్ష్మీ నరసింహావదానులగారి కుమార్తె. శ్రీ గబ్బిట దుర్గాపతి శాస్త్రి, నాగమ్మ గారి వివాహం ఉయ్యూరు లో ధూమ్ ధాం గా జరిగిందట. సదస్యం నాడు బ్రాహ్మణులకు శ్రీ దక్షిణామూర్తి శాస్త్రి గారు బంగారు నాణాలు ఇచ్చారట.ఈ దంపతులకు 1890 లో శ్రీ మృత్యుంజయ శాస్త్రిగారు జన్మించటం, కొద్దికాలానికే గబ్బిట దుర్గాపతి శాస్త్రిగారు చనిపోవటం ఆస్తి అంతా ఆయన అన్నదమ్ముల భాగాలలో ఆయనకు కొంత దక్కటం నాగమ్మ గారు ఉయ్యూరు వచ్చి పుట్టింట్లో ఉండటం జరిగింది. నాగమ్మ గారికి ఒక అక్కయ్య, ఇద్దరు చెల్లెళ్ళు ఉండేవారు. వారి తండ్రి వీరిలో ఎవరికి

ముందుగా మగపిల్లాడు పుడితే వారికి తన యావదాస్తి రాసిస్తానని చెప్పి, ముందుగా నాగమ్మ గారికి శ్రీ మృత్యుంజయ శాస్త్రి జన్మించటం చేత దౌహిత్రుడైన ఆయనకు తనకున్న ఉయ్యూరు కాటూరు వీరవల్లి లలో ఉన్న పొలాలు ఉయ్యూరులో ఉన్న పెంకుటిల్లు డొడ్డి, వగైరా అంతా రాసి మాట నిలబెట్టుకొన్నారు. ఇలా రామారావు గూడెం అగ్రహార భూములు, ఉయ్యూరులోని గుండు లక్ష్మీనరసింహావదానులగారి ఆస్తి సంక్రమించాయి. లక్ష్మీనరసింహావదాను గారు ఉయ్యూరులో రావి చెట్టుబజారులో ఉన్న స్థలం లో శ్రీ సువర్చలాన్జేయస్వామిని ప్రతిష్టించి దేవాలయ నిర్మాణం చేసి, ధూప దీప నైవేద్యాలకు ఏర్పాటు చేశారు. ఆయన మరణం తర్వాత శ్రీ మృత్యుంజయ శాస్త్రి గారువంశ పారంపర్య ధర్మకర్తగా ఉంచి శాస్త్రి గారిని పెంచి పెద్దను చెసి చదువు చెప్పించి ఇంటికి ఉత్తరపు వైపునే ఉన్న గుండు సింగరి శాస్త్రిగారి కూతురు గుండువారి ఆడబడుచు అయిన భవానమ్మగారి నిచ్చి వివాహం చేశారు. శ్రీ భవనమ్మ గారి తమ్ముడే గుండు గంగయ్యగా ప్రసిద్ధుడైన గంగాధర శాస్త్రిగారు.

విద్యాభ్యాసం : శ్రీ మృత్యుంజయ శాస్త్రి గారు ఉయ్యూరులో నూతక్కి నుంచి వచ్చి స్థిరపడిన నూతక్కి శాస్త్రులుగారు లేక చెరుకుపల్లి శాస్త్రులుగారు అని పిలువబడే చెరుకుపల్లి ల్లక్ష్మీ నరసింహ శాస్త్రిగారి వద్ద వేదం శాస్త్రాలు నేర్చి తెలుగులో విద్వాన్ అయి ఉయ్యూరు సిబియెం స్కూల్ లో కొంతకాలం పని చేసి అనతపురం జిల్లా హిందూపూర్ లోని యిసియెం హై స్కూల్ లో సీనియర్ తెలుగుపండిట్ గా 22 ఏళ్ళు పని చేసి ఆ సర్వీస్ తో కృష్ణా జిల్లా బోర్డ్ హైస్కూల్ జగ్గయ్యపేట కు శ్రీ కాకాని వెంకటరత్నంగారి పూనికతో ట్రాన్స్ ఫర్ అయి, తర్వాత ఉయ్యూరు కు బదిలీ అయి వుయ్యూరు లో రిటైర్ అయ్యారు. శ్రీ శాస్త్రి గారు జిల్లాలోనే గొప్ప తెలుగు పండిట్, వేద ప్రమాణం లో ఘటికులని ,మంత్రార్థ వివరణలో మేటి అనీ అందరూ చెప్పుకొనీ వారు.

**సంతానం : 14 మంది సంతానం. పెరిగి పెద్దయి మిగిలిన వారు ఇదుగురు. శ్రీమతి లోపాముద్ర, శ్రీమతి దుర్గ, శ్రీ లక్ష్మీ నరసింహ శర్మ, శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్, శ్రీ కృష్ణ మోహన్...**




**రచనా వ్యాసంగం :** శ్రీ మృత్యుంజయ శాస్త్రి గారు కేవలం ఒక ఉపాధ్యాయుడిగా మాత్రమీ ఈ తరానికి తెలుసు. కానీ ఆయన ఒక గాంధే వాది, అయన అనుయాయుడు 1922 లోనే వుయ్యూరు లో వుయ్యూరు భారతీ విలాస జాతీయ పాఠశాల స్థాపించి కార్యదర్శి గా పనిచేసి స్వాతంత్ర సంగ్రమానికి అహింసా పద్దతి లో విదేశీ వస్త్ర దహనం, సహాయ నిరాకరణ ఉద్యమ భాగస్వామి అయ్యారు. కొద్ది కాలం జైలు కు కూడా వెళ్లారు. వుయ్యూరు కేంద్రం గా ఎన్నో ఆందోళనలు, మహాత్మా గాంధీ వుయ్యూరు పర్యటనకు వచ్చినపుడు అయన సంభాషణ ను తెలుగు లో కి అనువదించి పుర ప్రముఖుల ప్రశంసపొందారు.

నిరంతరం వివిధ వర్తా పత్రికలకు వుయ్యూరు,, వుయ్యూరు పరిసర ప్రాంత అభివృద్ధి, పశు సంరక్షణ, హైస్కూల్ కోసం దీక్షలు, రాట్నం వడకటం రెండు వేల మీటర్ల దారం రాట్నం ద్వారా వడకి కాంగ్రెస్ కి సమర్పించారు. ఒక్క తెలుగు సంస్కృతం మాత్రమీ కాదు. హిందీ ప్రచారానికి కూడా ఆద్యులు అయ్యారు.

హిందూపురం లో అయన సాహిత్యానికి చేసిన కృషి ఎనలేనిది నవ్య జ్యోతి మాసపత్రిక స్థాపించి తనకున్న కొద్దిపాటి వనరులతో నడిపి స్వాతంత్ర ఉద్యమానికి ఆ ప్రాంతం లో వేదికా గా నిలిచారు. స్వాతంత్రం వచ్చిన తరువాత ప్రజలు ఎలా ఉండాలి, భాషల స్థానం ఏలా ఉండాలి అని ఉపన్యాసాలు ఇచ్చిన మార్గదర్సకుడు.

హిందూపురం లో శారదా గ్రంధ పటనాలయని పది సంవత్సరము లు ఉపాధ్యక్షుని గా కొనసాగి గ్రంధాలయ ఉద్యమానికి తోడ్పడినారు. శ్రీ గాడిచెర్ల హరిసరోత్తమరావు గారిని హిందూపురం పిలిచి వారితో వయోజన్ విద్య ఆవశ్యకతను ప్రజలు వివరించటం లో తోడ్పడ్డారు.

ఇదు పుస్తకాలకు పీఠికలు రాసారు. అందులో గాంధీ శతకం ఒకటి.

త్యాగధనులు అనే పుస్తకం రాయటం అది కొంత కాలం విద్యార్థులకు ఉపవాచకం గా కూడా ప్రభుత్వం తీసుకొని ప్రచురించి విద్యార్థులకు అందించింది.



ఆరోజుల వార్తాపత్రికలు చూస్తె దాదాపు ప్రతి వారం అయన పేరు లేని వార్త రాని పత్రిక ఉండేది కాదు. దాదాపు 150 చిన్నవి , పెద్దవి వార్తలు అయన గురించి ఉన్నాయంటే అయన గొప్ప సంఘ సంస్కర్త అనేది ప్రజలకు తెలిసింది. అందుకే ఆయన్ను అప్పటి పత్రికలు **బ్రహ్మశ్రీ విద్వాన్ శ్రీ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి** గారు అని కీర్తించాయి.

**శ్రీ మృత్యుంజయ శాస్త్రి గారు నవంబర్ 21, 1961 స్వర్గస్తులు అయ్యారు.**

**ఇది అయన 132 వ జయంతి, ఆ సందర్భం గా** అయన గురించి భావి తరాలకు అందించాలని అయన రాసిన, పాల్గొన్న సమావేశాల వార్తా పత్రికల సమాహారం ఈ చిన్ని ప్రయత్నం.

ఇది చూసి తెలుగు వారు అందరూ వారి ఇంటి పాత తరం వారి గురించి సంకలనం చేస్తే వారి కధలు చరిత్రలో మిగులుతాయి అని ఆశిస్తూ ...

- గబ్బిట విస్తృత కుటుంబం

# కొడుకు చేయలేని పని మనవడు సాధించిన వేళ

**గబ్బిట దుర్గా ప్రసాద్ వుయ్యూరు సరసభారతి అధ్యక్షులు, శ్రీ శాస్త్రి గారి నాన్నగారి పేరు. సరసభారతి బ్లాగ్ నిర్వాహకులు, 30 పైగా గ్రంధాలు ప్రచురించారు.**

మా నాన్నగారు కీ .శే .విద్వాన్ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి గారి సాహితీ ,సాంస్కృతిక సేవల గురించి నాకు తెలిసింది చాలా తక్కువ. ఇందుకు నా బద్ధకం, అలసత్వం కూడా ముఖ్య కారణం. అసలు ఆయన గురించి పూర్తి విషయాలు సేకరించే ప్రయత్నామూ పెద్దగా నేను చేయకపోవటం కూడా ఒక కారణం.

ఇలాంటి విషయాలలో నా కంటే మా రెండో అబ్బాయి శర్మకు అభిరుచి, ఆలోచనా, ఆసక్తి చాలా ఎక్కువ. కనుక తాతగారి గురించి ఎక్కడ ఏ రకమైన సమాచారం దొరికినా ,సంతోషం తో నాకు పంపటం, నేను సరసభారతి బ్లాగ్ లో పెట్టటం జరుగుతోంది. ఇవాల్టి వరకు లభించిన సమాచారాలన్నీ సేకరించి సంకలనం చేసి, వివిధ శీర్షికలలో ఆ సమాచారాలను చేర్చి ఒక సమగ్రమైన ఫైల్ తయారు చేశాడు. ఇది అయన 132 జయంతి సంవత్సర కానుకా గా దాన్ని రేపు 31-8-22 వినాయక చవితి నాడు ఆవిష్కరిస్తున్నాము. వాడి శ్రమకు అభినందనలు. అందుకే కొడుకుగా నేను చేయలేని పనిని మనవడుగా వాడు సాధించిన వేళ మా అబ్బాయి శర్మను మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను. చరిత్ర లో కలిసిపోయిన అంశాలను మీ ముందుకు మరొక్క సారి ఇలా తీసుకురావటం ఆనందం.

మా నాన్నగారి అధ్యక్షతన శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమ రావు గారి తో వయోజన విద్యా సదస్సు నిర్వహించిన విషయం ,2000 మీటర్ల నూలు వడికించిన విషయం ఎవ్వరికీ తెలియదు. అలాగే మానాన్నగారు భారతీ జాతీయస్కూల్ స్థాపించి నిర్వహించిన విషయమూ అపూర్వం అద్భుతం మా కుటుంబానికి గర్వకారణం .ఇన్ని అద్భుత విషయాలు మా తండ్రి గారు సాధించినందుకు మాకు అమితానందంగా గర్వకారణం గా ఉంది.

మా నాన్న గారి గురించి మరిన్ని వివరాలు "ఊసుల్లో వుయ్యూరు" , సంకలనం చివర లింక్ ...

వినాయక చావితి శుభా కాంక్షలతో

మీ – గబ్బిట దుర్గా ప్రసాద్ -31-8-2022-ఉయ్యూరు .

# మా నాన్న స్మృతులు

**-గబ్బిట కృష్ణ మోహన్,** శ్రీ శాస్త్రి గారి ఆఖరి కుమారుడు. శ్రీ మోహన్ ప్రముఖ రచయిత పి.జి. వుడ్‌హౌస్ లాంటి హాస్య రచయితల రచనలు తెలుగులోకి అనువదించటం – అదీ, ఎంతో ముచ్చటగా అనువదించటం – తలపెడితే, దాన్లో ఎదురయ్యే సమస్యలు అన్నీ యిన్నీ కావు. అయినా శ్రీ గబ్బిట కృష్ణమోహన్ ఈ క్లిష్టమైన కార్యాన్ని అలవోకగా – ఒకసారి కాదు, మళ్ళీ మళ్ళీ కూడా – విజయవంతంగా నిర్వహించి చూపుతున్నారు



పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు నించి దెందులూరు వెళ్లి అక్కడనించి బండి మీదో నడిచో వెడితే రామారావుగూడెం అగ్రహారం వస్తుంది. ఈ ఉపోద్ఘాతం ఎందుకంటే అది మా పితరుల అగ్రహారం. మా తాతగారు గబ్బిట దుర్గాపతి శాస్త్రిగారు అక్కడి కరణం, మునసబు కూడా. భార్య నాగమ్మ. వారికి ఒక్కడే కుమారుడు మృత్యుంజయ శాస్త్రి. ఆయనే మా నాన్నగారు. చిన్నతనంలోనే వారి తండ్రి చనిపోయారు. ఆ అగ్రహారం వదిలి ఉయ్యూరుకి మకాం మార్చారు.

పక్క ఇంట్లోనే వున్న గుండు సింగరి శాస్త్రిగారి కూతురు భవానమ్మ గారితో చాలా చిన్నతనంలోనే వివాహం జరిగింది. అదీ మా అమ్మా నాన్నల వైవాహిక జీవితానికి నాంది.

ఇంట్లో అందరితో సరదాగా వుంటూనే కొంత సీరియస్ గానే వుండేవారు. పెద్దకుమార్తె వేదవల్లి వివాహం అయి పురిట్లో చనిపోయింది. కుమారుడు లక్ష్మీనరసింహ శర్మ రైల్వేలో పనిచేస్తూ 32వ ఏట 1959లో ఇద్దరు పిల్లలు పుట్టిన తరువాత చనిపోయారు. ఆ దుఃఖం మనసులోనే వుంచుకునే చనిపోయారు. పెద్దమ్మాయి లోపాముద్ర. ఎందుకో ఆమెని అక్కయ్యా అని పిలిచేవారు.

తరువాత దుర్గ, దుర్గాప్రసాద్ (తితియ్యా అని ముద్దుపేరుతో పిలవడం), ఆఖరికి నేను. నన్ను మోగన్ అని పిలిచేవారు.

హిందూపురం నుంచి బదిలీ మీద జగ్గయ్యపేట, ఉంగుటూరు.

ఇంతకీ ముత్తయ్య కరణం గారు అగ్రహారానికి వెళ్లారా అంటే అవును. మా అమ్మగారితో కలిసి రెండు మూడు నెలలు వున్నారక్కడ.

వూర్లోనే పుచ్చా శివయ్యగారనే రిటైర్డ్ హెడ్ మాస్టరు శ్రీ సరస్వతీ ట్యుటోరియల్ కాలేజ పెట్టారు. దాంట్లో తెలుగు టీచర్ గా కొంతకాలం పనిచేశారు.

**నాన్నగారు చిట్టిగూడూరులో చదువుకుని తెలుగు విద్వాన్ చేయడంతో అనంతపురం జిల్లా హిందూపురంలో ఎడ్వర్డ్ కారొనేషన్ మునిసిపల్ (ఈ.సి.ఎం) స్కూల్లో తెలుగు పండితులుగా చేరారు. దాదాపు 20 సంవత్సరాలకు పైగా అక్కడే చేశారు. ఆ వూరు అప్పుడు మైసూర్ రాజ్యంలో వుండేది.**

**దానికి ముందే అంటే సరిగ్గా వంద సంవత్సరాల కిందట (1922) వుయ్యూరు భారతీ విలాస జాతీయ పాఠశాలను స్థాపించి దానికి కార్యదర్శిగా వున్నట్టు ఆంధ్రపత్రికలో వారు రాసిన లేఖలో సమాచారం లభ్యమైంది**

జమీందారీ చట్టం వస్తోంది, అగ్రహారాల్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకుంటుదనే భయంతో చివరకి అమ్మకానికి పెట్టారు. ఆ వూరి వారే చందూరి సుబ్బారావనే ఆయనతో ఉయ్యూరికొచ్చి దాదాపు నెలరోజులు మా ఇంట్లోనే వుంటూ రెండు పూటలా భోజనం చేస్తూ చివరకి 29 వేలకి కొనుక్కున్నారు.

సినిమా ప్రహసనం

గబ్బిట విస్తృత కుటుంబం

చిన్నప్పుడు వూర్లో వున్న ఒకే ఒక శ్రీ ఏకాంబరేశ్వర టాకీసులో సినిమా చూడటానికి మా నాన్నగారిని చాలా బతిమాలాల్సి వచ్చేది. ఒక పట్టాన ఒప్పుకునేవారు కాదు. దానికి తగిన ఉపాయం కనిపెట్టారు మా అమ్మగారు, అక్కయ్యలు.

నాన్నగారు పడకకుర్చీలో కూచునుంటే మా మేనమామగారి కూతురు రాజ్యలక్ష్మి "సినిమాకి వెడదాం మావయ్యా" అంటూ రోజుల తరబడి బతిమాలితే చివరకి ఒప్పుకునేవారు. మేమంతా  6 అణాల (42 పైసలు) బెంచి టికెట్టు ఆయనొక్కరే 10 అణాల (65 పైసలు) కుర్చీ టికెట్టు.

మరిన్ని ఊసులు " వుయ్యూరు ఊసులు" లో చదవండి. లింక సంకలనం చివర .....

అయన చనిపోయి ఆరు దశాబ్దాలు దాటిన సందర్భం గా ఇలా ఒక సంకలనం రావటం. అది అయన గురించి మాకు కొత్త  గా తెలియటం మరింత ఆనందం.

# మా తాత గారు  గబ్బిట గాంధీ..వుయ్యూరు గాంధీ.

- గబ్బిట(వేలూరి) వేదవల్లి – గబ్బిట లక్ష్మీ నరసింహ శర్మ గారి  అమ్మాయి.

మా తాత గారు కీర్తి శేషులు గబ్బిట మృత్యుంజయ శాస్త్రి గారు చాలా మృదు స్వభావి , స్ఫురద్రూపి,  సౌమ్యులు గా నాకు బాగా గుర్తు. కు వస్తారు ఎప్పుడూ.  అయన నా 8 వ ఏటనె స్వర్గస్తులు అయ్యినా ఆయనతో నా సాన్నిహిత్యం అత్యంత ఆనందదాయకం. మా పెద్ద మేనత్త గారి పేరు తోనే నన్ను ఆదరించిన తీరు కడు రమ్యం.

మా నాన్నగార్రు శ్రీ లక్ష్మీ నరసింహ శర్మ మా చిన్నప్పుడే కీర్తిశేషులు అవ్వడం తో, నాకు మా తమ్ముడు రామనాద్ బాబు కి ఆయనే మొదటి సంరక్షకులు. నాకు తెలిసి ఆయన స్వతంత్ర ఉద్యమం లో పాల్గొన్నారని మాత్రమే తెలుసు

ఈ సంకలనం తో అమూల్య వివరాలు, విషయాలు తెలిసాయి. అయన సంస్కృత, ఆంధ్రాలలో దిట్ట అని తెలిసినా, తెలియని మరెన్నో సంగతులు తెలియవచ్చాయి. మా ఇంట్లో చరఖా ఉండేదని తెలుసు, కానీ రెండు వేల మీటర్ల దారం రాట్నం ద్వారా తీసారని తెలిసి ఆశ్చర్యానికి, ఆనందానికి లోనయ్యాను.

ఈ సంకలనం చూస్తె ఆయనలో మరొ  కోణం రాజకీయ  చైతన్యం అని పిస్తుంది.  బహుశా అయన వీటి మీద ఇంటిలో ఎక్కువ చర్చలు చెయ్యలేదు అనిపిస్తోంది.

కుటుంబ పెద్దగా అయన వేసిన బాట, చూపిన మార్గం ఆచరణీయం, మా నానమ్మ గారు శ్రీమతి భవానమ్మ, తాత గారి సహచర్యం లో పండిన ధీశాలి. వారిద్దరూ మాకు ఆదర్శం.

గబ్బిట విస్తృత కుటుంబం

మాకు బాగా గుర్తు పేద విద్యార్థులు ఎవరైనా భోజనానికి ఇబ్బంది పడకూడదని వారికి భోజన వసతి కల్పించేవారు. మేము వారిని వారాలబ్బయిలు గా గౌరవం ఇచ్చేవాళ్ళము. తరువాత వారంతా ఉన్నత స్థానాలలో ఉన్నారని తెలిసి చాలా సంతోషించేవాళ్ళము. వారు వచ్చినప్పుడు మా గబ్బిట విస్తృత కుటుంబం గురించి చెబుతుంటే మేము ఆనందడోలికల్లో తేలియాడేవాళ్ళము.

తాత గారిని ప్రతిరోజూ గుర్తుంచుకునేలా కుటుంబం లో ఇద్దరికీ అయన పేరు పెట్టుకొన్నారు అంటే అది అయన మీద ఉన్న గౌరవం. పేరు మహిమ వాళ్ళ ఆ ఇద్దరూ చదువులో, ఉద్యోగాలలో ఉన్నతం గా రాణించారు. ఇది అంతా అయన చలవే.. మా అత్త శ్రీమతి దుర్గ వివేకానందం గారి అబ్బాయి వేలూరి మృత్యుంజయ శాస్త్రి అమెరికా లో స్థిరపడ్డాడు. రెండు మా బాబాయి శ్రీ దుర్గా ప్రసాద్, ప్రభావతి గారి అబ్బాయి గబ్బిట మృత్యుంజయ శాస్త్రి డిస్ట్రిక్ట్ ఫస్ట్ గా వచ్చాడు. IRMA లో ఎంబిఏ చేసాడు. TCS ఉద్యోగం చేసాడు.

ఆయన కు ఖాదీ, గ్రంధాలయ ఉద్యమాన్ని సైతం నడిపారని తెలిసి చాలా సంతోషిస్తున్నాను. హిందీ భాష అబివృద్ధికి, సాహిత్య సాంస్కృతిక కార్యక్రమాలలో వారి విస్తృత కీర్తి ని తెలియచేసే వివిధ వ్యాసాలు, వార్తాపత్రికలో వచ్చిన వ్యాసంగాలు, వార్తా సమాహారాలు చదివిన తరువాత అయన నేర్పు, శ్రమ, కృషి, పట్టుదల, దేశం ఎడల అంకిత బావం చాలా ఆనంద పరిచాయి.

**అందుకే మా తాత మాకు గాంధీ. గబ్బిట గాంధీ.. వుయ్యూరు గాంధీ.**

# ఆంధ్రపత్రిక 1950లో హిందూపురం



హిందూపురం

ఈపట్టణ కాంగ్రెసు సంఘ యాజమా
న్యాన ఈ 16న సంతాపసభ జరిగింది సభకు
డా॥ ఎస్ సీతారాము శాస్త్రిగారు అధ్యక్షత
వహించారు కోటా వెంకటశేషయ్య, గబ్బిట
మృత్యుంజయశాస్త్రి ఆర్యసుఖదేవవర్మ
గార్లు పటేల్ మహాశయునికి జోహారులర్పిం
చారు సభికులం కొన్ని నిముషాలపాటు
మౌనాన్ని పాటించారు

| | |
|---|---|
| తేదీ వివరాలు | 1950లో హిందూ పురం లో సర్దార్ పటేల్ మరణానికి సంతాపం గా జరిగిన సభ పైనా ఆంధ్ర పత్రిక లో రిపోర్ట<br>ఆదివారం డిసెంబర్ 24 |
| పేజి | 3 |
| లింక | https://ia902203.us.archive.org/23/items/ANDHRAPATRIKA24121950/317887_ANDHRAPATRIKA_24_12_1950_Volume_no_37_issue_no_262.pdf |

# ఆంధ్రపత్రిక ఉయ్యూరులో 1929

## ఉయ్యూరు

ప్రాథమిక ఉపాధ్యాయసమితి సమావేశము

గబ్బిట మృత్యుంజయశాస్త్రి



## సతీన్ సేనుగారు ప్రాణోపద్రవకరమగు స్థితిలోనుండుట

ఇంకను నిరశనవ్రతము ప్రారంభింపబడుచో బలవంతముగా ఆహార మెక్కించబడును

ఇతర నిరశనవ్రతుల స్థితి

| తేది వివరాలు | 21.9.1929న ఉయ్యూరులో జరిగిన ప్రాథమిక ఉపాధ్యాయ సద జరిగిన సభ పైనా ఆంధ్రపత్రిక లో రిపోర్ట్ |
|---|---|
| పేజీ | 24 |
| లింక | https://ia802504.us.archive.org/14/items/ANDHRAPATRIKA28091929/312426_ANDHRAPATRIKA_28_09_1929_Volume_no_17_issue_no_149.pdf |

page no 24

# నవ్య జ్యోతి మాసపత్రిక

## అనుబంధం – 2

## తెలుగు సాహిత్య పత్రికలు

[తెలంగాణా ప్రాంతంలో వెలువడిన తెలుగు సాహిత్య పత్రికల వివరాలను డా॥ ఎస్.వి. రామారావు గారు, కోస్తా ప్రాంతానికి సంబంధించిన వాటిని డా॥ జంధ్యాల జయకృష్ణ బాపూజీగారు, రాయలసీమలో వెలువడిన పత్రికల వివరాలను శ్రీ ఆశావాది ప్రకాశరావుగారు సేకరించి అకాడమీకి అందించినారు.]



| పత్రిక పేరు | సంపాదకులు | స్వభావము | స్థలము | కాలము |
|---|---|---|---|---|
| సవిత | శ్రీశ్రీ | త్రైమాస పత్రిక | హైదరాబాదు | 1963 అక్టోబరు |
| నవభారతి | చదలవాడ పిచ్చయ్య, జె. రాధాకృష్ణారెడ్డి | మాసపత్రిక | విజయవాడ | 1958 |
| నవభారతి | కలచవీడు మురళీధర్ | త్రైమాస | అనంతపురం | 1976 |
| నవయుగం | — | వారపత్రిక | — | – |
| నవయుగ | ఎస్. వి. నరసయ్య | మాస, పత్రిక | విజయవాడ | 1947 |
| నవశక్తి | గొట్టిపాటి సుబ్బారాయుడు | వారపత్రిక | అనంతపురం | – |
| నవోదయ | నీలంరాజు వేంకటశేషయ్య | ,, | మద్రాసు | 1946 |
| నవ్యజ్యోతి | గబ్బిట మృత్యుంజయశాస్త్రి | మాసపత్రిక | హిందూపురం | – |
| నవ్యభారతి | వేదాంతం రామకృష్ణమాచార్యులు | పక్షపత్రిక | నరస రావుపేట | 1959 |
| నవ్యవాణి | నవ్యసాహితీసమితి | త్రైమాసిక | హైదరాబాదు | 1967 |

| | |
|---|---|
| తేదీ వివరాలు | విద్వాన్ శ్రీ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి గారు అనంతపురం జిల్లా హిందూపూర్ లో ఎడ్వర్డ్ కారోనేషన్ మునిసిపల్ హైస్కూల్ (ఇ.సి.ఎంహైస్కూల్ )లో సేనియర్ తెలుగు పండిట్ గా 1931 నుంచి 1953వరకు పని చేసినపుడు ''నవ్య జ్యోతి ''మాస పత్రిక కు సంపాదకులుగా ఉంటూ వెలువరించారని నాకు ఇంతవరకు |

| | |
|---|---|
| | తెలియదు .దీని విషయం శ్రీ ఆశావాది ప్రకాశరావు గారు రాయల సీమ లో వెలువడిన పత్రికల గురించి సేకరించివిషయాలను తెలుగు అకాదేమికి అందించినట్లు ,ఇవాళ శర్మ సేకరించి పంపగా తెలిసి మహా సంతోషం పొందాను .వాడికి అభినందనలు - |
| పేజి | 445 |
| లింక | https://ia801604.us.archive.org/8/items/in.ernet.dli.2015.489107/2015.489107.Telugulo-Parishodhana.pdf |

# ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ

కపిలేశ్వరపురంలో 429

జిల్లాలో వారి సంచారం పూర్తి అయ్యేవరకు వారు కాంగ్రెసు మహాత్ముని స్వాధీనంలో ఉంచినారు ఉయ్యూరులో మహాత్ముని కార్యక్రమానికి పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసు సభ్యులు శ్రీ వల్లభనేని వెంకటరావు గబ్బిట మృత్యుంజయశాస్త్రి, గాయత్రి అనంతరామయ్యగార్లు ముఖ్యంగా తోడ్పడినారు మహాత్ముని బృందంతో శ్రీ గాదిరాజు వెంకటేశ్వరరావు మద్దూరి సుబ్బారావుగార్లు స్వచ్ఛంద సేవకుల దుస్తులతో పశ్చిమ కృష్ణా పర్యటనలో వెంట వెళ్ళినారు

| | |
|---|---|
| తేదీ వివరాలు | కొడాలి ఆంజనేయులు(సం.)<br>1978 |
| పేజి | 429 |
| లింక | https://ia601600.us.archive.org/8/items/in.ernet.dli.2015.492158/2015.492158.aandhrapradeish-loo.pdf |

# పండిత త్రయం పరలోక యాత్ర - హిందూపురం

## హిందూపురం

విద్వాన్ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి గారీవిధంగా వ్రాస్తున్నారు

"ఒక్క సంవత్సరములోపలనే ప్రముఖ పండిత త్రయము పరలోక యాత్ర గావించుట తెలుగు తల్లి కారని పుండు. గడచిన మార్చి నెలలో తాడిపత్రి యందు జరిగిన అనంతపుర మండలోపాధ్యాయ పండిత పరిషత్తున అధ్యక్షత వహించ విచ్చేసినపుడు శాస్త్రి గారిని సందర్శించు భాగ్యము మాతోటివారికబ్బినది. శాస్త్రుల వారి గంభీరమయిన యాకారము, తొణుకు బెణుకులు లేని వాక్చాతుర్యము, అసాధారణ పరిశోధనా పటిమ, గాంధీమహాత్మునిపై గాఢ భక్తి, నిష్కపట స్వభావము, బహు భాషా పాండిత్యము సాటిలేనివి. వారు ప్రారంభించిన శిల్ప వస్తుసమీకరణ బాధ్యత సోదరాంధ్రులందరు కొనసాగించి కృత కృత్యులగుటయే శ్రీ వారి యాత్మశాంతికి సముచిత సాధనము"

| | |
|---|---|
| తేదీ వివరాలు | 06.09.1950 భుదవారం |
| పేజీ | 5 |
| లింక | https://ia802505.us.archive.org/1/items/ANDHRAPATRIKA06091950/317785_ANDHRAPATRIKA_06_09_1950_Volume_no_37_issue_no_157.pdf |

Page no 5 :  06.09.1950  Wednesday

# ఉయ్యూరు లో హిందీ ప్రేమీ  మండలి 1958




| | |
|---|---|
| తేదీ<br>వివరాలు | 05-07-1958  సోమవారం |
| పేజీ | 2 |

# శ్రీ మహాత్మా గాంధీ శతకము

శ్రీరస్తు

అస్మత్సహృదార్యులగు మహారాజశ్రీ డి. యల్. గంగాధరయ్య శ్రేష్ఠి గారిచే విరచితమగు "గాంధీశతకము" నామూలాగ్రముఁగ దిలకించితి. ఇదియే ప్రథమ ప్రయత్నమగుటచే నెందేని దొసఁగులు వొసఁగి యుండవచ్చును. "కథంనసామద్గిరమా విలామపి స్వసేవినీమేవపవిత్రయిష్యతి" యను భంగిఁ బురుషోత్తముఁడగు గాంధీమహాత్ముని చరితము పద్యాత్మకముగ రచియించి యుండుటంజేసి కవిభారతియు, జన్మమును పవిత్రములాయెనని నిస్సంశయముగా నుడువనగును. వీరిట్టిలోకోత్తర చరిత్రములనేకములవ్రాసి దేశారాధకులగుదురుగాక.

ఇట్లు,

హిందూపురము.
23_12_33

సహృదయ విధేయుడు
విద్వాన్ గబ్బిట మృత్యుంజయశాస్త్రి.

| | |
|---|---|
| తేదీ వివరాలు | డి యల్ గంగాధరశ్రేష్ఠి, అంబటి సుబ్బరాయగుప్త(పరిష్కర్త)రాసిన సతకం లో ముందు మాట |
| పేజి | 11 |
| లింక | https://ia601600.us.archive.org/16/items/in.ernet.dli.2015.491568/2015.491568.shrii-mahaatmaa_text.pdf |

# హిందూపురం అరవిందయోగికి శ్రద్ధాంజలి

# అరవింద యోగికి శ్రద్ధాంజలి

హిందూపురం, డిసెంబరు 8: నిన్న ఇక్కడి హైస్కూలులో జరిగిన సభలో ప్రసంగిస్తూ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి గారు "అరవిందుని భౌతిక నిర్యాణం ప్రపంచానికే తీరనిలోటని" అన్నారు. ప్రభుత్వ ప్రాతిపదిక శిక్షణాలయంలో జరిగిన సభలో ఎం ఎల్ నరసింహం గారు అరవిందుడు మానవజాతికి చేసిన సేవను గురించి వివరించారు అరవిందయోగి స్మృతి చిహ్నంగా సభికులు శాంతిపత్ర మౌనాన్ని పాటించారు సీతారామమందిరంలో శ్రీ వి నారాయణరావు గారి అధ్యక్షతను మందిర భాగులు సమావేశమై అరవిందయోగికి శ్రద్ధాంజలి సమర్పించారు అధ్యక్షుడు, "నేటి శాస్త్రీయ ప్రపంచంలో అరవిందుని పాత్ర ప్రాముఖ్యతను వివరించారు. సభికులు 2 నిముషముల మౌనాన్ని పాటించారు.

| | |
|---|---|
| తేదీ వివరాలు | 09.01.1945 మంగళవారం |
| పేజి | 4 |
| లింక్ | https://ia902206.us.archive.org/0/items/ANDHRAPATRIKA14121950/317877_ANDHRAPATRIKA_14_12_1950_Volume_no_37_issue_no_252.pdf |

# హిందూపురం ఉపాధ్యాయ పండిత పరిషత్తు



| | |
|---|---|
| తేదీ వివరాలు | అక్టోబర్ 9ఆదివారం 1949 |
| పేజీ | 3 |
| లింక | https://ia802507.us.archive.org/22/items/ANDHRAPATRIKA09011945/316225_ANDHRAPATRIKA_09_01_1945_Volume_no_31_issue_no_231.pdf |

# హిందూపురం చిత్రకవితా ప్రదర్శనం



4 ఆంధ్రపత్రిక, ఆదివారం అక్టోబరు 9, 1949

వరద బాధితులకు సహాయము

నర్సాపురంలో బియ్యంకొరత

పోకూరి కాశీపతిగారి ఆశు, చిత్రకవితా ప్రదర్శనము

విశాఖపట్నానికి గవర్నర్ జనరల్ రాక

డిసెంబరు మొదటివారంలో

తెనాలి తాలూకాలో 5 గురు కమ్యూనిస్టుల అరెస్టు

మదరాసు వార్తలు

త్యాగరాయ నగరు విస్తరణ

టౌనుప్లానింగ్ స్కీముకు కార్పొరేషన్ ఆమోదం

రత్నం మెమోరియల్ చదరంగపు పోటీలు

విలీనసంస్థానాలకు రాజ్యాంగ నిబంధనలపై అనధికారచర్చ

సర్దారుపటేలు భవనంలో కాంగ్రెసువాదుల సమావేశం

| | |
|---|---|
| తేదీ వివరాలు | అక్టోబర్ 9 ఆదివారం 1949 |
| పేజి | 3 |

| | |
|---|---|
| లింక | https://ia802507.us.archive.org/6/items/ANDHRAPATRIKA09101949/317545_ANDHRAPATRIKA_09_10_1949_Volume_no_36_issue_no_186.pdf |

# హిందూపురం త్యాగబ్రహ్మ జయంతి



## త్యాగబ్రహ్మ జయంతి ఉత్సవములు

హిందూపురము

స్థానిక త్యాగరాజ సేవాసంఘ యాజమా
న్యమున ఇచ్చట జనవరి 25 నుండి మూడు
రోజులపాటు త్యాగబ్రహ్మ జయంత్యుత్సవ
ములు జరిగినవి. విద్వాన్ చిన్న మ
ణుగూరు రామారావుగారు సభలను ప్రారంభిం
చిరి టి. గురుమూర్తిగారు సభికులకు త్యాగ
య్యను పరిచిరి. విద్వాన్ గబ్బిట మృత్యుంజయ
శాస్త్రిగారి అధ్యక్షతను జరిగినసభలో టి.
వి. వరదాచార్య శిరోమణిగారు ప్రసంగించిరి
మైసూరి అంజనప్పగారి పాటసభ జరిగినది
రెండవనాటి సభకు టి. వి. వరదాచార్యులు
గారు అధ్యక్షత వహించిరి. మృత్యుంజయ
శాస్త్రిగారి ఉపన్యాసానంతరము చి. నర
సింహమూర్తి, ఎం. పి స్వామిగార్ల పాట
కచ్చేరీ జరిగినది. మూడవనాటిసభకు విద్వాన్
చిన్నమణుగూరు రామారావుగారు అధ్యక్షత వ
హించిరి. టి. గురుమూర్తిగారు ఉపన్య
సించిరి. ఉంఛవృత్తి తిరుప్పావై కొందరు గాయకు
లకు బిరుద ప్రదానములు జరిగినవి.

| | |
|---|---|
| తేదీ వివరాలు | 05.02. 1951 సోమవారం |
| పేజీ | 2 |
| లింక | https://ia802504.us.archive.org/1/items/ANDHRAPATRIKA05021951/317925_ANDHRAPATRIKA_05_02_1951_Volume_no_37_issue_no_303.pdf |

# ఉయ్యూరు  రెండు వేల  మీటర్ల నూలు సమర్పణ




| తేదీ వివరాలు | 1924 11.11.1924 మంగళవారం |
|---|---|
| పేజీ | 12 |
| లింక | https://ia802504.us.archive.org/1/items/ANDHRAPATRIKA05021951/317925_ANDHRAPATRIKA_05_02_1951_Volume_no_37_issue_no_303.pdf |

# ఉయ్యూరు   బ్రాహ్మణ సమాఖ్య పిలుపు


చెన్నపురి కార్పొరేషను

గుడివాడ

మదరాసు కార్పొరేషను బడ్జెటు

| | |
|---|---|
| తేదీ వివరాలు | 1929 భుదవారం   అక్టోబర్ 27 |
| పేజీ | 1 |
| లింక | https://ia802501.us.archive.org/5/items/ANDHRAPATRIKA27101926/311496_ANDHRAPATRIKA_27_10_1926_Volume_no_14_issue_no_175.pdf |

# హిందూపురం కవి సమ్మేళనం



హిందూపురం

సెప్టెంబరు 30:— మొన్నటిరోజు సాయంకాలము 6 ఘంటలకు స్థానిక మునిసిపల్ గ్రంథపఠనాలయమున శ్రీ గొల్లపల్లి రామశాస్త్రి, బి. ఏ. గారి అధ్యక్షతక్రింద "నైతికకవిత్వము" పై శ్రీ బిట్రగుంటి రామచంద్రరావుగారు సదరీసభలో నుపన్యసించిరి. భావకవులు, వారు రచించిన రచనలను యువకులు ప్రజలు ఆదరించవలెనని శ్రీ రావుగారు తెలిపిరి.

నిన్నటిరోజు ఉదయము 8 ఘంటలకు సత్యనారాయణ సన్నిధానములో శ్రీ గబ్బిట మృత్యుంజయశాస్త్రి గారి అధ్యక్షత క్రింద జరిగిన సభలో శ్రీ బిట్రగుంటి రామచంద్రరావుగారు కవిత్వమునుగూర్చి ఉపన్యసించిరి. సదరీసభలో శ్రీ గురుమూర్తి, సుబ్బశాస్త్రి, మొదలగువారు పైవిషయములో ముచ్చటించిరి.

నిన్నటిరోజు సాయంకాలము 6 ఘంటలకు హిందూపురము హెర్క్యులస్ వ్యాయామసంఘము 5 వ వార్షికోత్సవము మునిసిపల్ కమీషనరుగారగు శ్రీ జె. సాంబయ్యనాయుడు బి. ఏ. గారి అధ్యక్షతక్రింద జరిగెను. పురమున అధికార, అనధికార ప్రముఖులందరు పై సందర్భములో హాజరైరి. డా॥ రాజు, శ్రీ ఎల్. జి. శాస్త్రి మొదలగు ప్రముఖులు వ్యాయామశాల విజయమునుగూర్చి మాటలాడిరి. (స్వ. వి.)

| | |
|---|---|
| తేదీ వివరాలు | 1941 అక్టోబర్ 2nd గురువారం |
| పేజీ | 3 |

| లింక | https://ia802500.us.archive.org/1/items/ANDHRAPATRIKA02101941/315219_ANDHRAPATRIKA_02_10_1941_Volume_no_28_issue_no_180.pdf |
| --- | --- |

# గ్రంథాలయ సర్వస్వము(మార్చి 1935)



### అభిమానులు పోషకులు.

4 నెలల ఒట్టు ఖర్చులలో గ్రంథాలయపు ఆస్తిగా రు 94-0-6 ఖరీదుగల పుస్తకములను మాత్రము చేర్చగలిగితిమి. ముందు అభిమానుల ప్రోత్సాహమున గ్రంథాలయము అభివృద్ధి చెందగలదని నమ్ముచున్నాము. గుడివాడ కాపురస్థులగు శ్రీయుత టి. జి. కృష్ణమూర్తిగారు సభాకార్యక్రమములు పత్రికలో చూచినంత మాత్రముననే ఆనందపరవశులై అయాచితముగా రు 25-0-0 విరాళముగా పంపిరని పాఠకలోకమునకు తెలియజేయుటకు మిక్కిలి సంతసించుచున్నాము. వీరిగాక కొన్ని పుస్తకములను గ్రంథాలయమునకు నొసంగిరి. మరియు దాసా కృష్ణయ్యగారు, కోరంట్ల వెంకటేశయ్యగారు, కోరంట్ల వెంకటరమణయ్యగారు, దాసా నరసింహయ్యగార్లు గ్రంథాలయమునకు పుస్తకములు, కొంత విరాళమును చెల్లించి గ్రంథాలయాభివృద్ధికి మార్గదర్శులైరి. ఈ విధముననే ఎల్లరు ముఖ్యావశ్యకమైన యీ గ్రంథాలయమును పెంపొందించుటకు తోడ్పడ కోరిక.

### కృతజ్ఞతానివేదనము.

పత్రికలో మా కార్యక్రమము నవలోకించిన మాత్రమున మిక్కిలి ఆనందభరవశులై సభా రాజపోషకులును, సభాప్రథమబంధువు నైనట్టి శ్రీయుత టి. జి. కృష్ణమూర్తిగారికిని, (గుడివాడ) గ్రంథాలయాభివృద్ధికి సాహాయ్యము చేసిన ఉదారులకును, సభా కార్యక్రమములందు తోడ్పడుచున్న [illegible]లకును, శ్రీ సనాతన నాయుర్వేద వైద్యశాలలో వైద్యులుగా నుండి ఉచితముగా సేవచేయుచున్న బ్ర॥ శ్రీ గణేశ శాస్త్రిలవారికిని, కోరినంతనే ఎంతటిమార్గ వ్యయమునకునైన లోనై విచ్చేసి మృదుమధుర గానప్రదర్శనములచే అభ్యుదయ్యుడు సభ్యులను సానందసుఖమున నోలలాడించు గాయకశిఖామణి శ్రీమాన్ కె. శేషాచార్యులవారికిని (తిరుపతి), ఉపన్యాసములకు కాలక్షేపములకు ప్రదర్శనములకు తగ్గక వచ్చు ప్రేక్షకులకును, మా చిక్కాలికలగు శ్రీ శారదా, సనాతనధర్మ సంవర్ధని సంస్థల కరముగా కృతజ్ఞతాభివందనము లర్పించుచు, కల కాలము మా అనన్యకరుణా ప్రసారము వెల్లువ్వడును ఈ మా బిడ్డలకడ ప్రసరింపజేయుచు, పరమేశ్వరుని కృపాకటాక్షమునకు పాత్రులై చిరాయురారోగ్యైశ్వర్యవంతు లగుదురుగాక యని ప్రార్థించుచున్నారము.

### ముఖ్యోద్దేశములు.

1. ధార్మికాధ్యాత్మిక సాంఘిక విషయముల నుపన్యాసముల మూలమున చక్కగ బోధించుట.
2. పై సభయం దొసంగబడు శ్లాఘ్యతమోపన్యాసములను ముద్రించి యాంధ్రలోకమున కొసంగుట.
3. ఆధ్యాత్మిక సారస్వత సాంఘిక విషయముల జక్కగా విమర్శించు 'భారతోల్లాసిని' యను మా సభాపత్రికను ప్రచురించుట.
4. శ్రీ సనాతనాయుర్వేద వైద్యశాలను నెలకొల్పుట.
5. జనులయం దడుగంటిన యభిమానము నుద్ధరించుట.
6. హిందూ మతవర్ణాశ్రమాచారము లన్నిటిని లౌకికాధ్యాత్మిక ప్రయోజనములను నిరూపించుట.
7. పురాణములపై మనవారిచేతను, అన్యమతస్థులచేతను, నారోపింపబడు నాక్షేపములకు సక్రమంబులగు సమాధానంబుల విశదపరచుట.

8. సంధ్యావందనాది నిత్యనైమిత్తికకర్మలయం దుపయుక్తమంత్రములకును, పౌరాణిక సకలచరిత్రంబులకు శాస్త్రీయ ధార్మిక ఆధ్యాత్మికము లను త్రివిధదృష్టితో పరిశీలించిన విశదమగు సద్యుక్తి రహస్యార్థములు తెలుపుట.

9. ఆంధ్ర గీర్వాణ సారస్వతముల నుద్ధరించుట.

10. ఈ దేశమున గల గొప్ప పండితుల రావించి వారిచే పైవిషయములయందు ఉపన్యాసముల నిప్పించుట.

11. ఇట్టి సనాతన ధర్మప్రబోధములను ఇచ్చుటకై శాఖ దేశమున నెల్లెడ గావించుట.

12. ఈ సభయొక్క శాఖాసభలను ఇతర స్థలముల నెలకొల్పుట.

13. పై విషయముల కనుకూలముగు నొక గ్రంథాలయమును, పఠనాలయమును స్థాపించుట.

పైవిషయములయందు ఎవరి కేలాటిసంశయములు కలిగినను, మ మ్మడిగిన సభాముఖమున శాస్త్రీయములగు సమాధానంబుల నొసంగగలము కాన వారివారి సందేహములనడిగి సదుత్తరంబులు పొందుటకు ప్రార్థించుచున్నాము.

1930, 1931, 1932 వ సంవత్సరముల ఆదాయవ్యయ పట్టిక:—

| జమల వివరము | | ఖర్చుల వివరము | |
|---|---|---|---|
| 1930 సం॥ జనవరి మాసారంభమున నిలువ | 36-7-3 | ఆఫీసు ఖర్చులు. | 158-12-8 |
| చందాలు, విరాళములజమలు | 167-15-6 | పత్రికలకు | 27-4-6 |
| కార్యదర్శిగారు ప్రతి సం॥ పోషకచందా 12-0-0 కు పైబడి యుపయోగించుచున్న సాహిత్యము శాఖవారియొద్ద సభాకార్యక్రమములకు (1932వ సం॥న) తీసుకొన్న నగదు జమ | 68-4-0 | ప్రింటింగ్ | 32-5-0 |
| | | గ్రంథాలయమునకు పుస్తకములు కొన్నది | 54-8-0 |
| అధ్యక్షులవారియొద్దనున్న నగదు | 15-0-0 | అధ్యక్షులవారియొద్ద నిలువ | 14-12-7 |
| మొత్తం జమ | 287-10-9 | మొత్తం ఖర్చు | 287-10-9 |

శ్రీమాన్ పండిత శిరోమణి
టి. వి. వరదాచార్యులు,
అధ్యక్షులు.

బ్ర॥ శ్రీ విద్వాన్ గబ్బిట మృత్యుంజయశాస్త్రులు,
ఉపాధ్యక్షులు.

ఇట్లు, దాసోహం,
కందాడై భాష్యం.
కార్యదర్శి.

| | |
|---|---|
| తేదీ వివరాలు | అయ్యంకి వేంకటరమణయ్య(సం.) 1935 |
| పేజి | 10,11 |
| లింక | https://ia601603.us.archive.org/8/items/in.ernet.dli.2015.370673/2015.370673.Grandhaalayasarvasvamu-Sanputi.pdf |

# వీరవల్లి సాహిత్య కార్యక్రమం 1926

వీరవల్లి

ఈ నెల మొదటి తేదీ శుక్రవారము, శ్రీ అరికెపూడి వెంకట్రామయ్యచౌదరిగారిచే నెలకొల్పబడిన ఆంగ్లాంధ్ర హిందీ పాఠశాలయొక్క ప్రథమవార్షికోత్సవము, వీరవల్లి మొఖాసాదారు శ్రీ॥ సీతంరాజు వీరభద్రరావుపంతులుగారి యాధిపత్యమున జయప్రదముగ జరుపబడినది. అధ్యక్షుని బ్యాండువాయిద్యముతో నూరేగించి ప్రత్యేకముగ వేయబడిన సభామందిరమునకు తీసుకొనివచ్చిరి. బాలురచే హిందీతెలుగు నాటకములు ప్రదర్శింపబడెను. అనంతరము బాలికలు సంగీతముబాడి సభ్యులనానందాబ్ధి నోలలాడించిరి. చుట్టుపట్లగల గ్రామవాస్తవ్యులు వెయ్యమందికిపైగ హాజరైరి. సభాధ్యక్షుని యుపన్యాసానంతరము సంస్కృతభాషనుగూర్చి బ్రహ్మశ్రీ గబ్బిట మృత్యుంజయశాస్త్రిగారును, ఆంధ్రభాషను గూర్చి బ్రహ్మశ్రీ సుందరరామశేషగిరిశర్మగారు నుపన్యసించిరి. పాఠశాలస్థితిగతులను శ్రీ వెంకట్రామయ్యగారు నివేదించిన యనంతరము, అధ్యక్షునికి, సభికులకు వందనములతో రాత్రి యెనిమిదిగంటలకు సభముగింపబడెను. రాత్రి గయోపాఖ్యానము హరికథగ జెప్పబడెను.

(ఒక విలేఖరి)

| | |
|---|---|
| తేదీ వివరాలు | 1926 జనవరి 7 గురువారం |
| పేజీ | 24 |
| లింక | https://ia902208.us.archive.org/20/items/ANDHRAPATRIKA07011926/311082_ANDHRAPATRIKA_07_01_1926_Volume_no_12_issue_no_315.pdf |

# పశు చికిత్సాలయం

గబ్బిట విస్తృత కుటుంబం



ఉయ్యూరు

పశుచికిత్సాలయము

మా గ్రామమున 1-9-30 తేదీని యీగ్రామీణులకే చిరకాల వాంఛితంబగు పశువుల యాసుపత్రికి ఉయ్యూరు రేంజి డిప్యూటీ యిన్స్పెక్టరు మ రా రా శ్రీ దర్భా వెంకట్రామయ్య శర్మగారి యాధిపత్యమున ప్రారంభోత్సవము జరుపబడెను.

8-8-30 వ తేదిని ఈగ్రామమున భూమి తనఖా బ్యాంకు డిప్యూటీ రిజిస్ట్రారు మ రా రా శ్రీ వేమూరి శివసుబ్బారావు గారి యాజమాన్యమున నెలకొల్పబడెను. మ రా రా శ్రీ వంగల గోపాలకృష్ణయ్యగారు అధ్యక్షులుగను కూరపనేని లక్ష్మీనారాయణగారు కార్యదర్శిగ నెన్నుకొనబడిరి. పది లక్షలరూ కప్పిచ్చుట కధికారము పొందబడెను.

గబ్బిట మృత్యుంజయశాస్త్రి.

| | |
|---|---|
| తేది వివరాలు | 1930 సెప్టెంబర్ 4 గురువారం |
| పేజీ | 16 |
| లింక | https://ia802504.us.archive.org/7/items/ANDHRAPATRIKA04091930/312701_ANDHRAPATRIKA_04_09_1930_Volume_no_17_issue_no_126.pdf |

# హిందూపురం చెళ్ళపిళ్ళ వారి సంస్మరణ సభ


హిందూపురం

స్థానిక ఉన్నత పాఠశాలలో గత ఆదివారం టి గురుమూర్తిగారి అధ్యక్షతను జరిగిన సభలో చెళ్లపిళ్ల కవిగారి మృతికి సంతాపం తెలుపుతూ తీర్మానం చేశారు. గబ్బిట మృత్యుంజయశాస్త్రి శిరోమణి టి వి వరదాచార్యులు చెళ్లపిళ్లవారి సాహిత్య సేవను గురించి ప్రసంగించారు.

| | |
|---|---|
| తేదీ వివరాలు | ఆదివారం ఫెబ్రవరి 26 1950 |
| పేజీ | 4 |
| లింక | https://ia802208.us.archive.org/30/items/ANDHRAPATRIKA26021950/317683_ANDHRAPATRIKA_26_02_1950_Volume_no_36_issue_no_322.pdf |

# హిందూపురం మన భాషల స్థానం

## హిందూపురం

హిందూపురం, అక్టోబరు 20 స్థానిక మునిసిపల్ హైస్కూలు ఉపాధ్యాయ సంఘంవారు విద్యావారము జరిపిన సందర్భంలో మొన్నటి కార్యక్రమానికి ప్రధానోపాధ్యాయులు పి. యం. మాధుశాస్త్రి గారు అధ్యక్షత వహించిరి. కె. బి. కృష్ణమూర్తిగారు "నవీనయుగంలో విజ్ఞానం" అను విషయమును గురించి ఉపన్యసించిరి. మరునాటి కార్యక్రమమునకు శ్రీమాన్ శిరోమణి టి. వి. వరదాచార్యులవారు అధ్యక్షపీఠము నలంకరించిరి. "స్వతంత్రభారతంలో మన భాషల స్థానం" అను శీర్షికపై గబ్బిట మృత్యుంజయశాస్త్రిగారును, "ప్రజాపాలనము, విద్య" అను విషయమును గురించి దుర్భాక కృష్ణయ్యగారును ఉపన్యసించిరి. సభికులకు తేనీరొసంగబడెను. కార్యదర్శి సేతూ రామరావుగారి వందన సమర్పణతో కార్యక్రమం ముగిసెను (స్వ. వి.)

| | |
|---|---|
| తేదీ వివరాలు | మంగళవారం అక్టోబర్ 25 1945 |
| పేజీ | 7 |
| లింక | https://ia902504.us.archive.org/20/items/ANDHRAPATRIKA25101949/317560_ANDHRAPATRIKA_275_10_1949_Volume_no_36_issue_no_201.pdf |

# వుయ్యూరు భారతీ విలాస జాతీయ పాఠశాల


ఆంధ్రపత్రిక

11

బడ్జెటుచర్చ

భారతీవిలాసజాతీయపాఠశాల

ఉయ్యూరు

"రాజపుత్రస్త్రీలలో సుప్రసిద్ధురాలును బలవంతురాలు నగు"

మిస్ "తారాబాయి" సర్కసు

చెన్నపురి కోటమైదానమందలి డేరాలలో ప్రదర్శింతురు.

మిస్ తారాబాయి.

50 మంది ప్రదర్శనకారులు.

A. K. Paul, Manager. A. M. G. Naidu, Agent. Tara Bai, Sole Proprietrix.

అహమదాబాదు సభలు

| తేదీ వివరాలు | 1922 శుక్రవారం ఏప్రిల్ 28 |
|---|---|
| పేజి | 11 |
| లింక | https://ia902509.us.archive.org/30/items/ANDHRAPATRIKA28041922/310512_ANDHRAPATRIKA_28_04_1922_Volume_no_9_issue_no_23.pdf |

# హిందూపురం శ్రీ గాడిచెర్ల హరిసర్వోత్తమరావు గారి ప్రసంగం




| | |
|---|---|
| తేదీ వివ రాలు | సోమవారం 1949 31st అక్టోబర్ |
| పేజీ | 4 |
| లింక | https://ia802506.us.archive.org/31/items/ANDHRAPATRIKA31101949/317566_ANDHRAPATRIKA_31_10_1949_Volume_no_36_issue_no_207.pdf |
| | |

# రవీంద్రుని అస్తమయం



| | |
|---|---|
| తేదీ వివరాలు | 1941 ఆగుస్ట్ 12 మంగళవారం |
| పేజీ | 3 |
| లింక | https://ia902506.us.archive.org/19/items/ANDHRAPATRIKA12081941/315098_ANDHRAPATRIKA_12_08_1941_Volume_no_28_issue_no_132.pdf |

## హిందూపురం

సెప్టెంబరు 30:— మొన్నటి రోజు సాయంకాలము 6 ఘంటలకు స్థానిక మునిసిపల్ గ్రంథపఠనాలయమున శ్రీ గొల్లపల్లి రామశాస్త్రి, బి. ఎ. గారి అధ్యక్షత క్రింద "నైతికవిత్వము" పై శ్రీ బిట్రగుంటి రామచంద్రరావుగారు సదరీసభలో ఉపన్యసించిరి. భావకవులు, వారు రచించిన రచనలను యువకులు ప్రజలు ఆదరించవలెనని శ్రీ రావుగారు తెలిపిరి.

నిన్నటిరోజు ఉదయము 8 ఘంటలకు సత్యనారాయణ సన్నిధానములో శ్రీ గబ్బిట మృత్యుంజయశాస్త్రి గారి అధ్యక్షత క్రింద జరిగినసభలో శ్రీ బిట్రగుంటి రామచంద్రరావుగారు కవిత్వమును గూర్చి ఉపన్యసించిరి. సదరీసభలో శ్రీ గురుమూర్తి, సుబ్బాశాస్త్రి, మొదలగువారు పైవిషయములో ముచ్చటించిరి.

నిన్నటిరోజు సాయంకాలము 6 ఘంటలకు హిందూపురము హైస్కూలు వ్యాయామసంఘము 5 వ వార్షికోత్సవము మునిసిపల్ కమీషనరుగారగు శ్రీ కె. సాంబయ్యగౌడరి బి. ఎ. గారి అధ్యక్షత క్రింద జరిగెను. పురమున అధికార, అనధికార ప్రముఖులందరు పై సందర్భములో హాజరైరి. డా॥ రాజు, శ్రీ ఎల్. జి. శాస్త్రి మొదలగు ప్రముఖులు వ్యాయామశాల విజయమును గూర్చి మాటలాడిరి. (స్వ. వి.)

| | |
|---|---|
| తేదీ వివరాలు | 1941 అక్టోబర్ 2 మంగళవారం |
| పేజీ | 3 |

| లింక | https://ia902506.us.archive.org/19/items/ANDHRAPATRIKA12081941/315098_ANDHRA PATRIKA_12_08_1941_Volume_no_28_issue_no_132.pdf |
|---|---|

# పరమహంస చిత్రపట ఆవిష్కరణ



పరమహంస చిత్రపటా
విష్కరణ

హిందూపురం, అక్టోబరు 30: మొన్న సాయంకాలం స్థానికఉన్నతపాఠశాల 5 వ ఫారము నీ సెక్షనులో శ్రీరామకృష్ణ పరమహంస చిత్రపటమును విద్వాన్ గబ్బిట మృత్యుంజయశాస్త్రిగారు ఆవిష్కరించిరి.

ఆసందర్భమున, జిల్లావిద్యాశాఖాధికారిగారు కూడ హాజరైయుండిరి.

| తేదీ వివరాలు | 1949 నవంబర్ 4 శుక్రవారం |
|---|---|
| పేజీ | 3 |
| లింక | https://archive.org/details/ANDHRAPATRIKA04111949/page/n5/mode/2up?q=%E0%B0%97%E0%B0%AC%E0%B1%8D%E0%B0%AC%E0%B0%BF%E0%B0%9F |

# డా. చిలుకూరి నారాయణ రావు హిందూపురం



| | |
|---|---|
| తేదీ వివరాలు | 1948 జనవరి 29 గురువారం |
| పేజీ | 2 |
| లింక | https://ia802509.us.archive.org/35/items/ANDHRAPATRIKA29011942/315274_ANDHRAPATRIKA_29_01_1942_Volume_no_28_issue_no_297.pdf |

# శ్రీ చెళ్ళపిళ్ళ కవి సంతాప సభ

హిందూపురం

స్థానిక ఉన్నత పాఠశాలలో గత ఆదివారం టి. గురుమూర్తిగారి అధ్యక్షతను జరిగిన సభలో చెళ్లపిళ్ల కవిగారి మృతికి సంతాపం తెలుపుతూ తీర్మానం చేశారు. గబ్బిట మృత్యుంజయశాస్త్రి శిరోమణి టి. వి. వరదాచార్యులు చెళ్లపిళ్లవారి సాహిత్యసేవను గురించి ప్రసంగించారు.

| | |
|---|---|
| తేదీ వివరాలు | 1950 ఆదివారం ఫిబ్రవరి 25 |
| పేజి | 2 |
| లింక | https://ia802208.us.archive.org/30/items/ANDHRAPATRIKA26021950/317683_ANDHRAPATRIKA_26_02_1950_Volume_no_36_issue_no_322.pdf |

# శ్రీమాన్ రామాచార్యులు హిందూపురం సన్మానం

# త్యాగధనులు

## త్యాగధనులు

రచయితలు:

ఆదిరాజు చంద్రమౌళీశ్వరరావు

గబ్బిట మృత్యుంజయశాస్త్రి విద్వాన్

(సీనియర్ తెలుగు పండిట్ ఇ. సి. యమ్. హైస్కూల్)

హిందూపురం

ప్రతులకు:

ఉమాపబ్లికేషన్సు, ఉయ్యూరు.

[వెల రు. 0-14-0

| | |
|---|---|
| తేదీ వివరాలు | ఆదిరాజు చంద్రమౌళీశ్వరరావు, గబ్బిట మృత్యుంజయశాస్త్రి 1950 |
| పేజీ | -- |
| లింక | https://ia801603.us.archive.org/1/items/in.ernet.dli.2015.330020/2015.330020.Thyaga-Dhanulu.pdf |

# మనవి

సర్వధర్మములకు మేలుబంతి స్వార్థత్యాగము. అట్టి త్యాగముచేతనే మహాత్ముని నాయకత్వమున మనభారతము సర్వతంత్ర స్వతంత్రమైనది. ఈ స్వాతంత్ర్యమునకు చిరస్థాయిత్వము భారత యువకుల ప్రవర్తనముపై నాధారపడినది. వారిట్టి శక్తిమంతులగుటకు స్వదేశమందలి స్వార్థత్యాగుల జీవిత పఠన మత్యావశ్యకము. ఇట్టిసంకల్పముతోనే భారత దేశమందలి ప్రాచీన నవీన త్యాగిశిరోమణుల జీవితగాథలిందు కూర్పబడినవి. వీనిం బఠించినబాలకులుత్తమ భారతపౌరులగుదురని మా హృదయపూర్వక విశ్వాసము.

కాని మా యీ ప్రయత్న సాఫల్యమున్నత పాఠశాలా నిర్వాహకులయు, నుపాధ్యాయ సోదరులయునుదార హృదయములపైనిలిచినది.

ఈ మాకృషికి గావించు సూచనలన్నియు సాదరముగ స్వీకరింపబడును.

—రచయితలు

# వి ష య సూ చి క



# జ్యోతిస్సంశ్లేషణం గబ్బిట మృత్యుంజయశాస్త్రి




| | |
|---|---|
| తేదీ వివరాలు | జ్యోతిస్సంశ్లేషణం 2019 లో పునర్ముద్రణ |
| పేజీ | -- |
| లింక | https://ia800907.us.archive.org/22/items/gabbita/%E0%B0%9C%E0%B1%8D%E0%B0%AF%E0%B1%8B%E0%B0%A4%E0%B0%BF%E0%B0%B8%E0%B1%8D%E0%B0%B8%E0%B0%82%E0%B0%B6%E0%B1%8D%E0%B0%B2%E0%B1%87%E0%B0%B7%E0%B0%A3%E0%B0%82.pdf |

# రచనలు

## ముద్రిత రచనలు

శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్ రాసిన ,సరసభారతి ప్రాచురించిన పుస్తకాలు డిజిటల్ రూపం లో .క్లిక్ చేస్తే చాలు పుస్తకం ప్రత్యక్షం

| | పుస్తకం పేరు | వివరాలు | ప్రచురణ | అంకితం | పేజీలు |
|---|---|---|---|---|---|
| 1 | ఆంధ్ర వేద శాస్త్ర విద్యాలంకారులు | 27 తెలుగు వేదశాస్త్ర ప్రవీణులు రచనలు | సెప్టెంబర్ 2010 | స్వర్గీయ శ్రీ కోమలి సూర్యనారాయణ శాస్త్రి | 55 |
| 2 | జనవేమన | వేమన యోగి గా మారిన విధం | ఏప్రిల్ 2012 | చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ | 116 |
| 3 | దర్శనీయ దైవ క్షేత్రాలు | 100 ప్రసిద్ధ దేవాలయాల చరిత్ర, దివ్యధామ దర్శనం | జనవరి 2015 | శ్రీ కోగంటి సుబ్బారావు శ్రీమతి సావిత్రి | 164 |
| 4 | శ్రీ హనుమత్ కథా నిధి | హనుమాన్ దివ్య చరిత్ర, పూజ శ్లోకాలు | ఉగాది 2012 | స్వర్గీయ పవని రాధాకృష్ణ | 159 |
| 5 | శ్రీ ఆంజనేయ స్వామి మహాత్మ్యం | ఆంజనేయస్వామి మహాత్యం, కథలు, విశేషాలు | జూన్ 2013 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 120 |
| 6 | సిద్ధ యోగిపుంగవులు | 35 సిద్ధుల జీవిత చరిత్రలు | ఏప్రిల్ 2013 | స్వర్గీయ మైనేని సౌభాగ్యమ్మ కుమ్మమూరు | 120 |
| 7 | మహిళా మాణిక్యాలు | 50 ప్రపంచ ప్రసిద్ధ మహిళల చరిత్రలు | మార్చి 2014 | శ్రీమతి మైనేని సత్యవతి USA | 184 |
| 8 | పూర్వాంగ్ల కవుల ముచ్చట్లు | 125 ఇంగ్లాండ్,అమెరికా దేశాల కవుల చరిత్ర | ఆగుస్ట్ 2014 | శ్రీ రాచకొండ నరసింహ శర్మ వైజాగ్ | 280 |
| 9 | గీర్వాణ కవులకవితా గీర్వాణం -1 | 146 సంస్కృత కవుల జీవిత విషయాలు | మార్చి 2015 | శ్రీ మైనేని గోపాలకృష్ణ USA | 408 |
| 10 | గీర్వాణ కవుల కవితా గీర్వాణం -2 | 482 సంస్కృత కవుల జీవిత విషయాలు | డిసెంబర్ 2014 | గబ్బిట భవానమ్మ మృత్యుంజయశాస్త్రి | 632 |
| 11 | గీర్వాణ కవుల కవితా గీర్వాణం -3 | 462 సంస్కృత కవుల జీవిత విషయాలు | డిసెంబర్ 2017 | డా\|\| భండారు రాధాకృష్ణ మూర్తి , సులోచన | 520 |
| 12 | దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు -1 | 201 ఆంజనేయ దేవాలయాల విశేషాలు | మే 2015 | శ్రీమతి వేలూరి దుర్గ, శ్రీ వివేకానంద | 264 |
| 13 | దర్శనీయ ఆంజనేయ దేవాలయాలు -2 | 221 ఆంజనేయ దేవాలయాల విశేషాలు | మార్చి 2019 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 312 |
| 14 | కెమోటాలజీ పిత డా.కొలాచల సీతారామయ్య | ఆయిల్ సైన్స్ శాస్త్ర సాంకేతిక శాస్త్రజ్ఞుడు | జనవరి 2016 | శ్రీ యలమంచలి సీతారామయ్య,శేషుమాంబ | 144 |
| 15 | దైవ చిత్తం | Mind of god కు తెలుగు స్వేచ్ఛ అనువాదం | ఏప్రిల్ 2016 | శ్రీ మైనేని గోపాలకృష్ణ USA | 80 |
| 16 | బ్రహ్మశ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రి | శత జయంతి ఉత్సవ సమీక్ష | మార్చ్ 2017 | శ్రీ మద్దులపల్లి మాణిక్య శాస్త్రి | 17 |
| 17 | ఆధునిక ప్రపంచ నిర్మాతలు – జీవితాలలో చీకటి వెలుగులు | చరిత్రను మలుపు త్రిప్పిన వివిధ రంగాల 91 ప్రపంచ ప్రముఖుల జీవితం సమగ్ర గ్రంథం | డిసెంబర్ 2017 | శ్రీ స్వర్గీయ పరచూరి రామకృష్ణయ్య | 704 |
| 18 | షార్లెట్ సాహితీ మైత్రీ బంధం | అమెరికా నార్త్ కరోలిన షార్లెట్ యాత్రా సాహిత్యం | 2018 | అమెరికా షార్లెట్ | 344 |
| 19 | అణుశాస్త్రవేత్త డా.ఆకునూరి వెంకట రామయ్య | 117 మూలకం టెన్నిస్సిన్ 'Ts'ఆంధ్ర అణుశాస్త్రవేత్త | అక్టోబర్ 2018 | స్వర్గీయ ఆకునూరి వెంకట సుబ్బమ్మ | 40 |
| 20 | శాస్త్రపరిశోధన పిత డా.పుచ్చా వెంకటేశ్వర్లు | ఆంధ్ర కాంతి శాస్త్ర పరిశోధన సాంకేతికవేత్త | మార్చి 2019 | శ్రీ ఆకునూరి రామయ్య | 32 |
| 21 | ఊసుల్లో ఉయ్యూరు | 75ఏళ్ళ అనుబంధం ,జ్ఞాపకాలు నాస్టాల్జియా | మార్చి 2020 | శ్రీ కోట సూర్యనారాయణ శాస్త్రి , సీతమ్మ | 304 |
| 22 | సోమనాథ్ నుంచి కాశీ విశ్వనాథ్ దాకా | 6 రాష్ట్రాల క్షేత్ర సందర్శన యాత్రా సాహిత్యం | మార్చి 2020 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 328 |
| 23 | ఆధునిక ఆంధ్ర శాస్త్ర మాణిక్యాలు | 62 ఆంధ్ర శాస్త్రవేత్తల జీవిత విశేషాలు, | మార్చి 2020 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 168 |
| 24 | వ్యాఖ్యాన చక్రవర్తి కోలాచలం మల్లినాద సూరి | శ్రీ పిజి.లాల్యే ఇంగ్లీష్ "మల్లినాథ'అనువాదం | మార్చి 2021 | శ్రీ మల్లినాద | 120 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 25 | ఆధునిక విదేశీ సంస్కృత విద్వాంసులు | 42 విదేశ సంస్కృత విద్వాంసుల రచనలు | మార్చి 2021 | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | 80 |
| 26 | Dr. Ankunuri Venkata Ramayya | డా ఆకునూరి వెంకటరామయ్య ఇంగ్లీష్ అనువాదం | అక్టోబర్ 2020 | స్వర్గీయ ఆకునూరి వెంకట సుబ్బమ్మ | 40 |
| | | | | | 5735 |

సంపాదకత్వం

| | పుస్తకం పేరు | వివరాలు | అంకితం | ప్రచురణ | పేజీలు |
|---|---|---|---|---|---|
| 1 | జ్యోతిస్సంశ్లేషణం | విద్వాన్ గబ్బిట మృత్యుంజయశాస్త్రి రచన | స్వర్గీయ గబ్బిట మృత్యుంజయ శాస్త్రి | మార్చ్ 2010 | 15 |
| 2 | ఉయ్యూరు ఊసులు | గబ్బిట కృష్ణ మోహన్ ఉయ్యూరు జ్ఞాపకాలు | ఉయ్యూరు | డిసెంబర 2010 | 42 |
| 3 | మహా కవితా సంతం | కవుల కవితలు సెప్టెంబర్ 2010 | స్వర్గీయ టి ఎల్ కాంతారావు | సెప్టెంబర్ 2010 | 32 |
| 4 | మా అక్కయ్య | ఉగాది కవితా సంపుటి | | ఆగష్టు 2011 | 40 |
| 5 | "ఆదిత్య "హృదయం | పద్య వచన కవితా సంకలనం | | మే 2012 | 24 |
| 6 | త్యాగి పే"రెడీలు' | శ్రీ టీవీ సత్యనారాయణ రచనలు | బాపు రమణ | మార్చి 2015 | 96 |
| 7 | శ్రీరామవాణి | శ్రీ తూములూరి దక్షిణామూర్తి గారి రచన | | | 24 |
| 8 | మా అన్నయ్య | కవితాసంకలనం | తాడికొండ భోగ మల్లికార్జునరావు దంపతులు | జూలై 2016 | 45 |
| 9 | శ్రీ సువర్చలా వాయు నందన శతకం | రామలక్ష్మణచార్యులు | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | ఫిబ్రవరి 2017 | 64 |
| 10 | శ్రీ సువర్చలా మారుతి శతకం | ముదిగొండ సీతరావమ్మ | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | ఫిబ్రవరి 2017 | 40 |
| 11 | శ్రీ సువర్చలేశ్వర శతకం | మంకు శీను | శ్రీ సువర్చలాన్జనేయ స్వామీ ఉయ్యూరు | ఫిబ్రవరి 2017 | 35 |
| 12 | వసుధైక కుటుంబం | ఉగాది కవితల సంకలనం | | మార్చి 2018 | 40 |
| 13 | సాహితీ ప్రవంతి | (సాహితీ మండలి తరఫున ) | | మార్చి 2012 | 25 |
| | | | | | 522 |

అంకాత్మక (డిజిటల్) పుస్తకాలు

| | పుస్తకం పేరు | వివరాలు | విడుదల | పేజీలు |
|---|---|---|---|---|
| 1 | కోనసీమ అందాలకు వేదపవిత్ర సొబగులు సౌరభాలు అద్దిన ఆహితాగ్నులు | Emeritus of South Asian Studies at the University of Visconsin, Madison లో Professor Da vid.M.Knipe Vedic Voices-intimate Narratives of a Living Andhra Tradition కి అనువాదం | 19-04-2019 | 67 |
| 2 | సమస్త భక్త శిఖామణులు | దైవం కోసం, దేశం కోసం, రాజ్యం కోసం, సాహిత్యం కోసం పాటుపడి చరిత్రలో మిగిలిపోయిన భక్త శిఖామణులు | 15-08-2021 | 350 |
| 3 | వేద, ఇతిహాస, తాత్వికరచనల విశ్లేషణ | వివిధ రామాయణ, భారత, భాగవత,వేద ఉపనిషత్తులు మొదలైన వాటిపై విశ్లేషణ | 10-09-2021 | 460 |
| 4 | దర్శనీయ మహాదే(వ-వి)నాయక ఆలయాలు | శివ, దేవి, వినాయక, విచిత్ర ఆలయాల చరిత్ర, శ్రీ ఆదిశంకర విశిష్ట వేదాంత రచన | 15-10-2021 | 625 |
| | | | | 1435 |

రాబోవు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | కార్తీకం లో మా పంచా రామ సందర్శనం కిరాతార్జునీయం శ్రీనాధుని భీమ ఖండ కధనం,కాశీ ఖండం గౌతమి మహాత్మ్యం | | 04-11-2022 | 450 |

గబ్బిట విస్తృత కుటుంబం

